https://sanchika.com/aacharyadevobhava-30/

# ఆచార్యదేవోభవ-30

రచన: డా. రేవూరు అనంత పద్మనాభరావు ఇతర రచనలు on: July 25, 2021 No Comments

ఈ శీర్షిక ద్వారా గత 20వ శతాబ్దిలో ఎందరో విశ్వవిద్యాలయ, కళాశాలల తెలుగు అధ్యాపకులను/ ఆచార్యులను తీర్చిదిద్దిన ప్రాతఃస్మరణీయ యశఃకాయులను పరిచయం చేస్తున్నారు **డా. అనంత పద్మనాభరావు**.

## భాషాశాస్త్ర 'మహాదేవుడు':

శ్రీశైల భ్రమరాంబ అనుగ్రహంతో ఏడు తరాల వరకు పాండిత్య స్ఫూర్తిని వరంగా పొందిన వంశం కోరాడ వారిది. తాళ్ళపాక వంశీయుల విషయంలో ఆరు తరాలని ప్రతీతి. కోరాడ రామచంద్రశాస్త్రి తొలి తెలుగు నాటకం – మంజరీ మధుకరీయం – రచయిత. ఆయన మనుమడు పరిశోధకుడైన కోరాడ రామకృష్ణయ్య. మదరాసు తెలుగు విశ్వవిద్యాలయం సందర్భంలో వారి కృషి పరిశీలించాం.

రామకృష్ణయ్య ద్వితీయ సంతానం మహాదేవశాస్త్రి. ఆయన తిరుపతిలో 1965-67 మధ్య మాకు ఎం.ఏ. తెలుగులో భాషాతత్వశాస్త్రం సాకల్యంగా బోధించారు. గంట కొడితే పాఠం ఆపే రకం కాదు. సబ్జెక్టులో మునిగిపోయేవారు. తరువాతి క్లాసు టీచరు వాకిట్లో కనిపిస్తే విరమించేవారు. ప్రతి క్లాసులోను తన గురువైన సునీల్ కుమార్ చటర్జీ ప్రస్తావన ఏదో ఒక రూపంలో ఉద్వేగభరితంగా చేసేవారు. తిక్కన అంటే ఆయన కిష్టం. తిక్కన అల్పాక్షరముల అనల్పార్థ రచనను ప్రస్తావించి – కట్టి – తొడి – పూసి – అని ఉదహరించేవారు. సిలబస్ పూర్తి చేయాలనే ఆతురత ఆయనలో కనిపించేది కాదు. ఎర్రన పద్యం 'గాసట బీసట్ చదివి' ప్రస్తావించేవారు తరచూ.

1942లో ఎకనామిక్స్ ఎం.ఏ. చేశారు. వెంటనే కేంద్ర కార్మిక శాఖలో ఉద్యోగం వచ్చింది. ఉద్యోగికి దూరభూమి లేదు — అని నమ్మిన వారు — సిమ్లాలో చేరారు. మనసంతా సాహిత్య పరిశోధనపై వుంది. ఆ ఉద్యోగం వదిలేసి వచ్చేశారు. కలకత్తా విశ్వవిద్యాలయంలో లింగ్విస్టిక్స్ ఎం.ఏ. చేశారు. ఢిల్లీలో 'ఫికీ' సంస్థలో సీనియర్ రీసెర్చ్ ఆఫీసరుగా పని చేశారు. సునీల్ కుమార్ చటర్జీ పశ్చిమ బెంగాల్ రాష్ట్ర శాసన మండలి అధ్యక్షులుగా 1952-58 మధ్య వ్యవహరించారు. భాషా శాస్త్ర పరిశోధనలో ఆయన దిట్ట. ఆయన వద్ద మహాదేవశాస్త్రి 'ది హిస్టారికల్ గ్రామర్ ఆఫ్ తెలుగు' అనే అంశంపై సిద్ధాంత వ్యాసం సమర్పించి 1959లో డి. లిట్ పొందారు. కలకత్తా విశ్వవిద్యాలయంలో ద్రవిడియన్ ఫైలాలజీలో ఎం.ఏ. చేశారు.

**ఉద్యోగ ప్రస్థానం:**

2021 మహాదేవశాస్త్రి శతజయంతి సంవత్సరం. 21 డిసెంబరు 1921 నాడు మచిలీపట్టణంలో జన్మించారు. 1957లో చిదంబరంలోని అన్నామలై విశ్వవిద్యాలయంలో లింగ్విస్టిక్ శాఖలో అధ్యాపకులుగా చేరారు. ప్రముఖ భాషాశాస్త్రవేత్త డా. మీనాక్షి సుందరం అక్కడ శాఖాధిపతి. మూడేళ్ళ పాటు మహాదేవశాస్త్రి పాఠాలు బోధించారు. 1960-68 మధ్య తిరుపతి శ్రీ వేంకటేశ్వర విశ్వవిద్యాలయ తెలుగు శాఖ అధ్యాపకులుగా అధ్యయన అధ్యాపనాలు కొనసాగించారు. వీరి పర్యవేక్షణలో 14 పిహెచ్.డి.లు, నాలుగు యం.ఫిల్‌లు వచ్చాయి.

**అనంతపురంలో తొలి అడుగు:**

1968లో పి.జి.సెంటర్ అనంతపురంలో పెట్టినప్పుడు మహాదేవశాస్త్రి స్పెషల్ ఆఫీసరుగా నియమితులయ్యారు. డా. శ్రీదేవి డైరక్టరుగా వచ్చేంత వరకు వారే అధిపతి. ఆ తరువాత ఆచార్యులుగా అనంతపురంలో 1989లో రిటైరయ్యారు. ఎందరో పరిశోధకులకు పర్యవేక్షకులు.

**శాంతినికేతన్‌లో...:**

1980 నవంబరులో శాంతినికేతన్‌లో అఖిల భారత ప్రాచ్యభాషా సదస్సులో ఒక సెషన్‌కు మహాదేవశాస్త్రి అధ్యక్షులు. ఆ సభలో నేను 'Udaharana Literature in Telugu' అనే ఆంగ్ల ప్రసంగ పత్రం సమర్పించాను. కార్యవర్గ ఎన్నికలలో మహాదేవశాస్త్రి పోటీ చేశారు. దాక్షిణాత్యులం శాస్త్రిగారికి మద్దతునిచ్చాం. తిమ్మావజ్ఝల కోదండరామయ్య, బేతవోలు రామబ్రహ్మం, నేను, ఇంద్రగంటి శ్రీకాంతశర్మ ప్రభృతులం నాలుగు రోజులు జరిగిన సదస్సులలో పాల్గొన్నాం.

**పాండితీధనుడు:**

యునెస్కో ప్రాజెక్టు క్రింద మానవశాస్త్ర విభాగంలో (Anthropology)లో క్షేత్రస్థాయి పరిశోధనలు చేసి భోజ్‌పురి మాండలికంపై అధ్యయనం చేశారు. విదేశాలలో భాషాశాస్త్ర బోధన చేసినవారిలో జి.యన్.రెడ్డి, మహాదేవశాస్త్రి, వేటూరి ఆనందమూర్తి ప్రముఖులు.

1971లో Dravidian Linguistic Society స్థాపించిన ముగ్గురు శాస్త్రవేత్తలలో మహాదేవశాస్త్రి ఒకరు. మిగిలిన వారు వి.వి. సుబ్రమణ్యం, ఆర్. సి. హీరేమఠ్. త్రివేంద్రంలోని International School of Dravidian Linguistics సంస్థకు గౌరవాధ్యక్షులు. ద్రవిడియన్ ఎన్‌సైక్లోపీడియా తయారు చేస్తూ నా చేత పింగళి సూరనపై వ్యాసం వ్రాయించారు.

**వీరి గ్రంథాలు:**

1. Historical Grammar of Telugu 1969
2. Descriptive Grammar and Hand Book of Modern Telugu 1985
3. ఆంధ్ర వాజ్మయ పరిచయము
4. బాల ప్రౌఢ వ్యాకరణ దీపిక
5. తెలుగు దేశ్యవ్యుత్పత్తి నిఘంటువు
6. స్థానిక తెలుగు భాషా శబ్దవ్యుత్పత్తి నిఘంటువు
7. A Folktale in Western Bhojpuri (1954)
8. Prakrit Inscriptions in Buddhic Andhra
9. Dialectal differences in Eleventh Century Telugu
10. పాళీ భాషా వాజ్మయములు
11. ప్రాఙ్నన్నయ శాసన భాషలో గ్రాంథిక వ్యావహారిక భేదములు.
12. కోరాడ రామకృష్ణయ్య స్మారక సంచిక సంపాదకత్వం (1992)

శాస్త్రిగారికి శ్రీ ఖరనామ సంవత్సరంలో బ్రౌన్ పురస్కారం 2011లో ప్రదానం చేశారు. మహాదేవశాస్త్రి 2016 అక్టోబరు 11న తిరుపతిలో తమ కుమారుడు సూర్యనారాయణ ఇంట్లో కాలధర్మం చెందారు. శాస్త్రి గారికి ఆంధ్ర ప్రదేశ్ ప్రభుత్వ హంస అవార్డు, మండలి వెంకట కృష్ణారావు స్మారక పురస్కారం లభించాయి.

**తండ్రిని మించిన తనయుడు:**

"20 శతాబ్ది తొలి పాదంలో ఆచార్య కోరాడ రామకృష్ణయ్య గారు, ద్రావిడ భాషా తులనాత్మక అధ్యయనానికి వైతాళికులు కాగా, వారి కుమారులు ఆచార్య కోరాడ మహాదేవశాస్త్రి తెలుగు దేశ్య పదాలకు మూల ధాతువులను కనుగొని, ఆ మూల ధాతువుల నుండి ఏర్పడిన పదాలను ఒక అకారాది క్రమంలో పేర్చి తెలుగు దేశ్య వ్యుత్పత్తి నిఘంటువును నిర్మించారు... వీరి 'హిస్టారికల్ గ్రామర్ ఆఫ్ తెలుగు' గ్రంథాన్ని చదివి అందులో మహాదేవశాస్త్రి గారు – 'ంబు' పదప్రయోగం గురించి చేసిన విశ్లేషణ ఆధారంగా ప్రముఖ తమిళ భాషా చారిత్రక పరిశోధకులు శ్రీ ఐరావతం మహదేవన్ సింధు నాగరికతా ఫలకాలలో కనిపించేవి కొన్ని తెలుగు పదాలు కూడా అయ్యే అవకాశం ఉందని ప్రకటించారు" – అధికార భాషా సంఘం అధ్యక్షులుగా డా. మండలి బుద్ధప్రసాద్ మహాదేవశాస్త్రి గ్రంథానికి ముందుమాట – భాషా సాగర మథనం – పేర వ్రాశారు. ఆ గ్రంథావిష్కరణ అనంతపురంలో శాస్త్రి గారి సమక్షంలో బుద్ధప్రసాద్, అప్పటి రాష్ట్రమంత్రి పల్లె రఘునాథరెడ్డి ఘనంగా నిర్వహించారు.